# నాగానందం

రచయిత

యం. సంగమేశం, యం. ఏ.,




ఉమా పబ్లిషర్సు
విజయవాడ - 1

# నలోదయం

చెల్లీ, ఏదైనా ఒక మంచికథ చెప్పమన్నావు. విను, ఇదో చక్కని కథ. చాలకాలం క్రిందట మన దేశంలో నిషధ దేశమనే రాజ్యముండేది. ఆ దేశానికి రాజు వీరసేనుడు. అతని పరిపాలనలో ప్రజలు చీకుచింతలు లేక నిత్య సుఖులై హాయిగా ఉండేవారు. ఆ మహారాజుకి తగినట్టుగానే అతని కుమారుడు నలుడనేవాడు చిన్నప్పుడే సకల విద్యలు సాంగో పాంగముగా నేర్చి, సాటివారిలో మేటియై ఇటు తండ్రికి అటు ప్రజలకి కూడ ఆశాంకురమై, అల్లారుముద్దుగా పెరిగి పెద్దవాడయేడు. తగిన వయస్సురాగానే నలుడు తన తండ్రి గారి సింహాసన మధిరోహించి, ప్రజాభీష్టమెరిగి, మంత్రి, సామంతుల సలహాలు మన్నించి రాజ్యం చేయసాగేడు.

అదే సమయంలో విదర్భదేశాన్ని భీమసేనుడనే రాజు పాలిస్తూ ఉండేవాడు. అన్ని విధాలా అతడు అదృష్ట వంతుడే, కాని సంతానం మాత్రం కలుగలేదు. అందుచేత ఆ మహారాజు చాలా పరితపించి, ఎన్నో వ్రతాలు, నోములు, ఉపవాసాలు, యజ్ఞయాగాలు చేసేడు. చివరకు దమన మునీశ్వరుని దయవలన అతనికి సంతాన ప్రాప్తికి వలసిన మంత్రం లభించింది. ఆ మంత్రోపాసనవలన భీమ సేనునికి దముడు, దాంతుడు, దమనుడు అనే రత్నాలవంటి

కౌతుకులు మున్నుగ పుట్టారు. ఆ వెనుక దమయంతి అనే కన్యారత్నమే పుట్టింది. ఆ రోజుల్లో మగవారిలో కెల్లా చక్కనివాడని నలుణ్ణీ, ఆడవారిలో కెల్లా అందమైనదని దమయంతినీ చెప్పుకొనేవారు. దమయంతి పెరిగి పెద్దదయి, విద్యాబుద్ధులు నేర్చి, వివాహ వయస్కురాలయ్యేసరికి ఆమె మనస్సు నలుని మీదకే పోయింది. అటు నలుడుకూడ దమయంతి రూపగుణ సౌశీల్యాదులు విని ఆమెనే వరించాలని ఉవ్విళ్లూరుతూండేవాడు.

ఒకనాడు నలుడు తన ఉద్యానవనంలో విలాసంగా విహరిస్తున్నాడు. ఆ సమీపంలో వచ్చి కొన్ని హంసలు వ్రాలేయి. అందులో ఒకటి పరధ్యాన్నంగా నిల్చి, తన సమీపానికి వచ్చిన నలుణ్ణి గమనించలేదనేసరికి హఠాత్తుగా నలుడా హంసను తన చేతిలో ఇముడ్చుకొన్నాడు. ఆ హంస పాపం, కావు కావుమని బొబ్బలుపెట్టి ఏడ్వసాగింది. ఏడవటమే కాక, మనుష్యభాషలో మాటాడుతూ రాజునిలా ప్రార్థించింది.

“మహారాజా, ఇంతవరకూ నిన్ను గురించి నేను వింటూ వచ్చిన దానికీ, నీయీచేసిన చేతకీ చాలా విపరీతం గోచరిస్తూంది. నలుడు భూతదయాపరుడనీ, అనాథ రక్షకుడనీ, అన్యాయాన్ని సహించడనీ నేను విన్న నీ కీర్తి శుద్ధ అబద్ధంగా తేలింది. నాబోటి దిక్కుమాలిన పక్షిని పట్టి నీవేమి గడించ దలచేవు రాజా? నా ఒక్కనితో సరికాదు. నా కోసం నా భార్య, పిల్లలు, ముసలి తల్లి దండ్రులు

అందరూ బెంగ పెట్టుకొని ప్రాణాలు విడుస్తారు. ఈ పాప మంతా నీ మెడని చుట్టుకొంటుంది.

ఇలా అని ఊరుకోక ఆ హంస మరీ బిగ్గరగా అరచి పిలపిస్తూ, "ఓయి భగవంతుడా, నీకెంత దయమాలి పోయిన దయ్యా, అయ్యో, నా పిల్లలకింకా కళ్లు విడలేదే! మాతల్లి కాటికి కాళ్లుచాచిన ముసలిదే! హా ప్రేయసీ, ఇక నాకు శెలవా! ఈ జన్మలో మన సాహచర్య మింతటితో సరి అయినదా!! ఆ బ్రహ్మ, పద్మంలో పుట్టిపెరిగి, పద్మాసనుడై, పద్మహస్తుడయికూడా అదే చేతులతో నా నుదుట మన యీ వియోగాన్ని వ్రాయడానికి ఎంత కఠోరమైన మనస్సు కలవాడో కదా! హా శ్రీహరీ, నావారిని తలచి నేనిక్కడా, నన్ను తలచి వారంతా అక్కడా చనిపోతూంటే చూస్తుం టావా?" అని ఇంకా ఇంకా ఎంతగానో ఏడ్చిగోలపెట్టేసరికి నలుని మనస్సు వెన్నలా కరిగిపోయింది. తాను చేసినది తప్పని తోచి, అతడు వెంటనే ఆ హంసను వదలిపెట్టాడు.

పట్టు వదలినదేతడవుగా ఆ హంస బ్రహ్మానందభరితు రాలయి, ఆకాశంలో అయిదారుసార్లు పల్టీలుకొట్టి, ఎగిరి ఆనందించి, అరచి, రాజు నాశీర్వదించి తిరిగి దగ్గరగావచ్చి నిల్చింది. "మహారాజా, నీమేలు మరువను. ఉపకా రానికి ప్రత్యుపకారము చేయదలచి వచ్చాను. నేను మామూలు హంసనుకాను. బ్రహ్మదేవుని వాహనాన్ని. ఒకనాడు బ్రహ్మ సరస్వతితో ముచ్చటించి చెప్తూఉండగా విన్న రహస్య మొకటి నీతో చెపుతాను. స్త్రీలలో సౌందర్య

వతిగా దమయంతిని. ఆమెకు తగిన జోడుగా పురుషులలో అందగానిగా నిన్ను బ్రహ్మ సృష్టించాడు. మీ యిద్దరికీ వివాహమైతే బాగుంటుందికదూ. నీకిష్టమైతే దమయంతి దగ్గర నీగుణగణాలు వర్ణించి ఆమెను నీకు సుముఖురాలుగా చేస్తాను. మరి శెలవు'' అనిచెప్పి ఆ హంస ఎగిరి పోయింది. నలునికి కుతూహలం, ఆశ్చర్యం, హర్షం ఆశ కూడా కలిగి, చాలసేపు ఆ హంసపోయిన మార్గాన్నే అలా చూస్తూ నిలిచి పోయాడు.

దమయంతి అంతఃపుర వాటికలో విహరిస్తూ ఉండగా హంస అక్కడికి చేరుకుంది. అలసి సొలసినదానివలె వచ్చి ఆమె సమీపంలో వ్రాలి, తిరిగి ఎగురబోయి బోర్లపడ్డట్లు నటించింది. దయామయురాలైన దమయంతి ఆ హంసను పట్టుకొని ఒడిలో పెట్టుకొని రెక్కలు నిమురుతూ, చెలికత్తెలతో చెప్పి పాలు తెప్పించి పట్టింది. సేద దేరిన తర్వాత ఆ హంస మానవ వాక్కులలో యిలా చెప్పింది.

"రాజకుమారీ, ఈ నీ ఉపకారం ఎన్నటికి మరిచి పోను, నీవలన నేడు నా ప్రాణాలు నిలిచేయి. నేను మామూలు హంసనుకాను. బ్రహ్మదేవుని వాహనాన్ని. నీ విషయంలో ఒకప్పుడు బ్రహ్మ నాతోచెప్పిన రహస్యాన్ని నీకు చెప్తాను. ఆ రోజున బ్రహ్మదేవుడు నా వీపుమీద సవారీ అయి కైలాసానికి వెళ్తున్నాడు. ఈ వూరి మీదుగా ఎగిరి వెళ్తున్నాము. నాకొక కుతూహలం కలిగి 'మహాత్మా, దమయంతివంటి సౌందర్యవతి నిక్కడ సృష్టించేవుకదా,

మరి ఆమెకు కాబోవు భర్తగా ఎవరిని సృష్టించేవు!' అని అడిగాను. "నిషధేశ్వరుడైన నలుడీమె భర్త" అని అతడు చెప్పేడు. అమ్మాయీ, నీవు నలుని గురించి విన్నావో, లేదో. అతడు అందాలకి మన్మధుడు, ప్రతాపానికి సూర్యుడు ఐశ్వర్యానికి కుబేరుడు. అన్ని విద్యలు ఎరిగిన అపరసరస్వతి. నీకిష్టమైతే నలమహారాజువద్ద నీరూప గుణాతిశయాలు వర్ణించి అతని మనస్సు నీపై లగ్నమయే ఉపాయం చేస్తాను. సరేనా?

హంస మాటకారితనానికి దమయంతి ఆశ్చర్య పోయింది. తను వలచిన నల్ణ్ణే తనకు భర్తగా సృష్టించిన బ్రహ్మకు మనస్సులో వేయి నమస్సులందించింది. "బ్రహ్మ దేవుని మాట జరుగవలసినదే కదా. నీయిష్ట" మని ముఖా వముగా హంసతో పలికి తన సమ్మతి వెల్లడించింది.

హంస వెళ్లినది మొదలు దమయంతికి మనస్సు మనస్సులో లేదు. సర్వకాల సర్వావస్థలలోనూ ఆమె కంటి ముందు నలుని రూపమే గోచరిస్తూంది. ఏపనిలోనూ ఆమెకు మనస్సు పట్టదు. ఎప్పుడుచూచినా పరధ్యానంగా ఉంటుంది. చెలికత్తెల వలన ఆయీ సంగతి విని తల్లి దండ్రులామె వివాహానికి సన్నాహాలు చేయసాగేరు.

ఆ రోజులలో రాజకన్యకలకి స్వయంవరాలు జరిగేవి. అంటే రాకుమారి తనకు నచ్చిన వరుని మెడలో పూలదండ వేస్తుంది. అందుకని రాకుమారు లందరినీ ఆహ్వానిస్తారు. భీమసేనుడు కూడ తన కుమార్తెకు స్వయంవరమని దేశంలో

రాజులందరికీ వర్తమానాలు పంపేడు. ఛప్పన్న దేశాల రాజులు స్వయంవరానికి తర్లి వెళ్లారు. నలుడుకూడ బయల్దే రాడు. నారదుని వలన దమయంతి చక్కదనాన్ని విని దేవలోకంనుండి దిక్పాలకులుకూడ స్వయంవరానికివచ్చారు. దారిలో వారు నలుణ్ణి చూసేరు. అతని రూపలావణ్యాలు చూచి అబ్బుర పడ్డారు. అటువంటి అందగాణ్ణి విడిచి దమ యంతి తమలో ఏ ఒక్కరినీ వరించదని తెల్సుకున్నారు. అందుకని నలుణ్ణి స్వయంవరానికి రాకుండా చేసే ఉపాయం ఆలోచించారు.

తమ ఉపాయాన్ననుసరించి దేవతలు నలుని తమ వద్దకు పిల్చి ఇలా చెప్పేరు. "నిషధేశ్వరా, నీకీర్తి ఎంత గానో వింటున్నాము. నీ గుణగణాలు దిక్కులన్నిటా మారు మ్రోగుతున్నాయి. మేము ఇంద్రాగ్ని యమ వరుణులము. నీవలన మాకొక ఉపకారము కావలసివుంది. ఈ దేవకార్యా నికి నీవు తప్పక తోడ్పడతావని ఆశిస్తున్నాం." నలుడు ఆ నలుగురు దిక్పాలకులకు నమస్కరించి "నా శక్తివంచనలేక మీ కార్యానికి తోడ్పడతాను. అదేదో శెలవివ్వండి" అన్నాడు.

నలుడు ఆడినమాట తప్పవలసినేవాడుకాడు. అందుకని దేవతలు ముందుగానే అతనివద్ద అంగీకారముద్ర గ్రహించి ఆమీద "నీవు దూతగా దమయంతి వద్దకుపోయి మా మా గుణాతిశయాలు వర్ణించి, ఆమెను మా నల్వురిలో ఎవరినైనా ఒకరిని వరించమని ప్రోత్సహించాలి. అంతఃపురంలోకి ఎట్లా

వెళ్ళేదని సంశయించకు. మేము తిరస్కరిణీవిద్య నిస్తాము. దాని ప్రభావంవలన నీవు ఇతరులకు కనపడవు. ఆ విద్య నీ స్వేచ్ఛ ననుసరించి పనిచేస్తుంది. కల్లకపటాలు విడిచి మాకు సహాయ్యపడగల ఉత్తముడు నీకంటె మాకు మరొకడు దొరకడు'' అని చెప్పేరు.

ఔదార్య గాంభీర్యానికి నిధి అయిన నలుడు తా నాశించిన ఫలితానికి దైవికంగావచ్చిన యీ ఆటంకాన్ని చూచి లోలోపల నవ్వుకున్నాడు. సరేనని ఒప్పుకొని దేవతల వద్ద తిరస్కరిణీవిద్య గ్రహించాడు. "తనను వరించమని హంసద్వారా వర్తమానమంపిన మహారాజు, తానే స్వయముగా దేవతలను వరించమని వర్తమానం తెచ్చి దమయంతి కివ్వబోయాడు! ఏమి భగవద్విలాసం! ఇంతకీ దమయంతి ఎవరిని వరిస్తుందో!'' అని అనుకొంటూ నలుడు అంతఃపుర ద్వారాన్ని సమీపించాడు.

అది రాణివాసం. పోతుటీగకూడ లోనికిపోరానిచోటు. లోపల అంతా ఆడారిమయం. ఆరోజు స్వయంవర సన్నాహాల వల్ల అక్కడ మరీ కలకలగాఉంది. ఎక్కడ చూచినా దాసీల హడావుడులే. వచ్చేవారు, పోయేవారు, మంతనాలాడేవారు, నవ్వేవారు, నవ్వులాటలాడేవారు ఒకరినిమించి ఒకరన్నట్లు చెలగాటమాడి తిరుగుతున్నారు దాసీలు. వారి మధ్యనుండి దమయంతి అభ్యంతర మందిరములోకి దారి తీసేడు నలుడు. ఇతడేమో వారికి కనపడడు. కాని అతనికి కనిపిస్తారు. ఎదురుగావచ్చి మీదపడేటంత హడావుడిలో వా

రున్నాడు. ఎక్కడ తన గుట్టు రట్టవుతుందోనన్న ఆందోళ నతో నలుగుతున్నాడు. ఎలాగైతేనేమి, చివరకతడు దమ యంతి సాన్నిధ్యానికి చేరుకొని కృతకృత్యుడయ్యాడు. తిరిగి ఆమె సౌందర్యాన్ని చూచి ముగ్ధుడయ్యాడు. తను వచ్చిన కార్యాన్ని తలంచి తనట్లా తలచకూడదను కొన్నాడు. కాని దమయంతి ఆ సమయంలో తనరూప గుణాదులే సఖులతో చర్చింస్తూండటం గమనించి, విధివైప రీత్యానికి మెచ్చుకున్నాడు. ఎట్టకేలకు తెగించి తిరస్కరిణీ విద్య తొలగించి దమయంతికి సాక్షాత్కరింతాడు.

ఉన్నట్టుండి ఊడిపడ్డట్టు, అతఃపురములోకి వచ్చిన రాజకుమారుని చూచి దమయంతి, ఆమె చెలికత్తెలుకూడ నివ్వెర పోయారు. ఉవ్వెత్తునలేచి కూర్చున్నారు.కూర్చున్న వారెందుకో అన్నట్లు లేచి నిలబడ్డారు. దమయంతి సమయజ్ఞు రాలు. ఉచితానుచితా లెరిగినపిల్ల. గాబరాపడడానికి బదులు సవినయంగా నల్ణుణ్ణి అడిగింది. అయ్యా, మీరెవరు? యీ అభ్యంతర మందిరం లోకి ఇందరి కండ్లు కప్పి మీరెలా రాగలిగేరు. మీ రూపురేఖలు, ధైర్య సాహసాలు, హావ భావాలుచూస్తే మీరు దివ్య పురుషులవలె కనిపిస్తున్నారు. మీరు నలమహారాజు కాదుకదా! ఇంతకీ మీరు వచ్చిన కార్య మేమో చెప్పి సంతోష పెట్టుతారా?''

దమయంతి మాటలు విని నలుడికెంతో ఆనందం కలిగింది. ''కల్యాణీ, నీ అనుమానం సత్యమే. నేను నలుణ్ణే. నేనిప్పుడు వచ్చిన కార్యం దేవకార్యం. ఇంద్రాగ్ని యమ

వరుణులు నీతో చెప్పమని కొన్ని వాక్యాలు నాకు చెప్పారు. ఆ సందేశం నీవు సావధానంగా వినవలసిందని నా కోరిక'' అన్నాడు నలుడు.

దమయంతి తటాలున లేచి, నలునికి రాజోచితమైన స్వాగత సత్కారాలు చేసి నమస్కరించింది. పిదప సవినయంగా అతనితో ఇట్లు పలికింది. ''మహారాజా, నీవు నా హృదయ మందిరములో ఎప్పుడో ప్రవేశించావు. ఇప్పుడీ అంతఃపురంలోకి సందేశవాహకుడవై దూతగా రావటం, అందులోనూ దేవదూతగా రావటం నా అదృష్టం. నీవు చెప్పవలసిన సందేశం చెప్తే వింటాను.'' అన్నది. నలుడు గుండె దిటవు చేసుకొని యిలా చెప్ప నారంభించాడు. ''రాజకుమారీ, దిక్పాలకులు నీ కటాక్షాన్ని ఆశించివచ్చారు. ఇంద్రాగ్ని యమ వరుణుల ప్రతాప ప్రాభవాలు నీవెరుగనివి కావు. వారిలో ఏ ఒక్కరినైనా వరించవలసినదని వారు వేర్వేరుగా నాద్వారా నిన్ను ప్రార్థిస్తున్నారని భావించు. ఇంకోమాట. వారంతా దేవతలు. వారిమాట కాదని నీ వితరుణ్ణి వరిస్తే వారు నీ వివాహానికి, భావిజీవితానికి కూడ కావలసినంతగా ఆటంకము కలిగించగలరు. అదికాక, దేవభోగం, కోరి వెదకి వచ్చిన అమృతం, కాలికి తగిలిననిధి, ఎందుకువదులుకోవాలి? కాబట్టి నీవీ నలుగురిలోనూ ఏ ఒక్కరినైనా వరించి నట్లయితే మేలౌతుందని నా అభిప్రాయం. ఏమంటావు?'' అని అడిగి నలుడు ఆమె జవాబుకోసం ఎదురు చూసేడు.

దమయంతి మొదట చిన్న నవ్వు నవ్వింది, పిదప గంభీర ముద్ర ధరించింది. వినయంగా దేవతలకి నమస్కారా లర్పించింది. పిదప "మహారాజా, దేవదూతగా వచ్చి నీవు నీ కార్యాన్ని నెరసులేకుండా నెరవేర్చావు. కాని నా మనస్సు ఏనాడో నీ పరమయింది. దాని నిప్పుడు ఏ దేవ తలు వచ్చినా మరల్చలేరు. నీవు కాదన్ననాడు దమయంతి యీ లోకంలోనే ఉండదు. ఇక నెందుకు నేను దేవతలకి భయపడాలో నీవే చెప్పు. అయితే, నేను వారిని నిందించ లేను. నా నిశ్చయానికి తోడ్పడవలసిందని నిర్మూలంగా వారిని ప్రార్థించుచున్నాను" అని నలునితో చెప్పింది.

నలుడు మరీ మరీ చెప్పి విసిగిపోయాడు. దేవతలు తననుఅనుమానిస్తారేమో అని శంకించాడు. దమయంతికి తన మీదగల అనురాగాన్నిచూచి తననుతానెంతో అదృష్టవంతు డని మెచ్చుకొన్నాడు. దమయంతి వద్ద శెలవు పుచ్చుకొని దేవతల వద్దకి వచ్చాడు. తూ చా తప్పకుండా తనకీ దమయంతికీ మధ్యజరిగిన సంభాషణ అంతా వారికి వినిపిం చాడు. దేవతల ఆశలు అడియాశలయ్యాయి. అయినా వారు తమ స్వార్థాన్ని ఇంకా వదల దలచలేదు.

మరునాడు స్వయంవరం. రాజాధిరాజులు, రాజ కుమారులు, దేవ గంధర్వులు కూడ వచ్చి సభనలంకరిం చారు. స్వయంగా సరస్వతి చెలికత్తెగావచ్చి, దమయంతితో ఆయా రాజుల నామగుణకీర్తులు వర్ణించి చెప్పసాగింది.

...కి కన్నుల పండువుగా అలంకరించుకొని, చేత

జయమాలగొని, దమయంతి సభామండపంలో గల రాజుల కీర్తి ప్రతిష్ఠలు, గుణాఖ్యానాలు వింటూంది. ఒకొక్కరినే విడిచి ముందుకు పోతూంది. నలుడెక్కడున్నాడనే చూపు మధ్య మధ్య ఆమె కన్నులలో తళుక్కుమంటూంది.

సరస్వతి దమయంతికి నలుని చూపెట్టింది. "ఇతడు నిషధేశ్వరుడైన వీరసేనుని కుమారుడు. పదునెన్మిది ద్వీపాలకి పట్టపురాజు. తనకీర్తి ప్రతాపాలు దశదిశలా నింపిన మహారాజు. సామంతుల మెప్పులంది సమస్త రాజకులానికి వన్నె తెచ్చిన చక్రవర్తి. అందకత్తెలందరూ ఏరికోరి వరించ దలుస్తూన్న నలమహారాజు యీ అందకాడే" అని చెప్పింది. దమయంతి ముఖం హర్షోత్సాహాలతో వికసించింది. చేతిలో ఉన్న జయమాల అప్రయత్నంగా మీదికిలేచింది. నలుని మెడలో పూలదండ పడబోతూం దన్నంతలోసరస్వతి "సఖీ, కాదు కాదు" అంది. "నలుడితడు కాడు. అదుగో ఆయన" అని ఆ ప్రక్కనే కూర్చున్న మరో నలుణ్ణి చూపింది. తిరిగి "ఉఁహూ! ఆప్రక్క నున్నవాడే నలుడు" అన్నాది. "కాదు కాదు, అరే! ఇదేమిటీ మాయ!! ఇక్కడ అయిదుగురు నలుళ్లున్నారే! సుందరీ ఇకనీయిష్టం. ఇందులోఎవరు నలుడో, ఎవరు కారో, నాకే తెలియకుండాఉంది. అని నివ్వెరపడి ఊరుకుంది.

దమయంతికీ రహస్యం విదితమయింది. దిక్పాలకులు నలుగురూ నలునివేషంతో వచ్చి కూర్చొన్నారని గ్రహించింది. వెంటనే వారినిలా ప్రార్థించింది. "దేవతలారా, మీ

సందేశాన్ని వినకపూర్వమే నా మనస్సు నలాయత్తమైంది. నలుని వరించడం నా ధర్మం. ధర్మానికి తోడ్పడమని ధర్మ మూర్తులైన మిమ్ములను నేను వేడుకుంటున్నాను'' అని వారందరికీ నమస్కరించింది.

దేవతలు ప్రసన్నులై నిజరూపాలతో లేచి నిలు చున్నారు. అసలు నలుడెవరో అందరికీ అర్థమయింది. దమ యంతి అతని మెడలో పూలమాల వేసింది. సభ జయజయ ధ్వానాలతో మారుమ్రోగింది. దేవతలు నల దమయంతు లిద్దరినీ ఆశీర్వదించి తమలోకానికి వెళ్లిపోయారు. మహా వైభవంగా దమయంతీ నలమహారాజుల వివాహం జరిగింది. కానుకలు, కట్నాలు, పుచ్చుకొని, అత్తమామలవద్ద శెలవు పుచ్చుకొని, దమయంతీ ద్వితీయుడై నలుడు తనరాజధాని చేరుకొన్నాడు.

కొన్నాళ్ళకి ఆ దంపతులకు ఇంద్రసేనుడనే కొడుకు, ఇంద్రసేన అనే కూతురు పుట్టేరు. కాని. చెల్లీ ఒకరు బాగుంటే చూచి సహించలేని వాళ్లుంటారుకదూ! విను.

దమయంతీ స్వయంవరానికి వచ్చిన దేవతలలో కలి పురుషుడు కూడ ఉన్నాడు. అతడు కామ క్రోధ లోభ మోహాదులకి రాజు. అనాచారాత్యాచారాలు రోగ మృత్యుభయాలు, దారిద్ర్య దుఃఖాలు అతని పరివారం. ఒకరిని బాధించి సంతసించడమే ఆయనకు ప్రియం. ఆ మహా నుభావునికి నలదమయంతుల వివాహం కన్నుకుటు అయింది. వారి సౌఖ్యం అతడు చూచి సహించలేకపోయాడు. ఎలా

కైనా వారిని నానాబాధలు పెట్టి తనకసి తీర్చుకోవాలనే పంతంపట్టి నిషధపురం ప్రవేశించాడు.

నలుడు ధార్మికుడు, సత్యవ్రతుడు, సజ్జనుడు. సర్వలకూ ఆదర్శ పురుషుడు. అయితేనేమి. ప్రమాదం ఎంతవారికైనా వస్తుంది. ఒకప్పుడు నలుడు కొంచెం బొల్లివిడిచి కాళ్లు కడుగుకొన్నాడు. సరి! కలిమహారాజు అదే సందుచేసుకొని నలుణ్ణి ఆవహించాడు. తన శరీరంలో కలి ప్రవేశించినదే తడవుగా నలుని వివేక బుద్ధులు అడుగంటేయి. ఆలస్యం పెరిగింది. అనాచారానికి పెంపు కలిగింది.

నలుని జ్ఞాతులలో పుష్కరుడనే ఆయన ఒకడున్నాడు. అతడు త్రాగుబోతు, జూదరి. వ్యభిచారి, అబద్ధాలకోరు, అన్యాయానికి వెనుకాడని చెయ్యి, కలిమహారాజుకి నచ్చిన స్నేహితుడు. నలునితో జూదమాడి అతని రాజ్యాన్ని గెల్చుకోమని కలి పుష్కరునికి సలహాయిచ్చాడు. తాను పాచికలలో నిల్చి పుష్కరుని విజయానికి తోడ్పడతానని మాట యిచ్చాడు. ఈ మద్దత్తుతో మదించి పుష్కరుడు నలుణ్ణి జూదానికి ఆహ్వానించాడు. బుద్ధిపెడతల బట్టి నలుడు జూదమాడటానికి అంగీకరించాడు! అదేమి జూదం! అంతా కలి మాయ. నలుడు తాను పెట్టిన పణాలన్నీ ఓడిపోతాడు. పుష్కరుడు వేసినపాచికలన్నీ గెలుచుకొంటాడు. ఇదే వరుసలో జూదమాడి నలుడు తన రాజ్యమంతా పుష్కరునికి ఓడిపోయాడు. "ఏముందిక? దమయంతినికూడాఒడ్డుతావా?" అని అడిగాడు పుష్కరుడు! నలుడు తనతప్పిదాన్ని గ్రహిం

చాడు. కాని జరిగినదానికి పశ్చాత్తాప పడి ఏమిలాభం! తన ఓటమి అంగీకరించి దమయంతితో కలసి ఊరువిడిచి ఎక్కడికో పోవడానికి ఉద్యుక్తుడయాడు. దమయంతిని విదర్భనగరం పంపివేయాలని అతని ఊహ. కాని దమయంతి కష్టకాలంలో తన భర్తను విడిచి వేరేఉండ గలదా! పిల్లలిద్దరినీ మాత్రం విదర్భనగరానికి పంపి, తాను భర్తతో కలిసి అరణ్యాలవెంబడి పోవడానికే ఆ పతివ్రత నిశ్చయించింది. ఊళ్లో ఎవరు వారి కాశ్రయమిచ్చినా వారు శిక్షార్హులు. అది పుష్కరుని మొదటి శాసనం. నలదమయంతులు కట్టు గుడ్డలతో కాన కేగవలసినదే కాని తమవెంట ఏమీ తీసుకొని పోకూడదు. ఇది అతని రెండవ శాసనం.

నలుడు ప్రతి పలుకలేదు. దించిన తల ఎత్తలేదు. కోప తాపాలణచు కొన్నాడు. తనతోపాటు దమయంతికి వచ్చిన కష్టాలుచూచి గ్రుడ్ల నీరు గ్రుక్కుకున్నాడు. విధివైపరీత్యమని ఎంచి, లేనిధైర్యం తెచ్చుకొని అరణ్యానికి త్రోవ తీసేడు.

అది బ్రహ్మాండమైన కీకారణ్యం. పట్టపగలే అక్కడ చీకటి జీమూతంగా ఉంటుంది. కీరుమని కీచురాళ్లు అరుస్తూనే ఉంటాయి. మధ్య మధ్య పులులు, సింహాలు గర్జిస్తాయి. ఏ ప్రక్కనుండి ఏమి వస్తుందో తెలియదు. ఏ డొంకలో ఏ ముందో అనే భయం అలాటి అడవిలో కంకరరాళ్లూ ముళ్లూ గ్రుచ్చుకొనే త్రోవలో నడచి తనవెంటవస్తూన్న సుకుమారి

దమయంతినిచూచి గుండె చెరువై పోయింది, "ప్రియురాలా, నీవెందుకీ కష్టాలుకొని తెచ్చుకుంటావు? హాయిగా పుట్టింటికి పోతే సకల సౌఖ్యాలు అనుభవించవచ్చు. ఈ కష్టాలు కాపురముండవు. నేను తిరిగి మంచిరోజులు రాగానే నిన్ను కలుసుకొంటాను. నా మాటవిని నువ్వు మీ తల్లి దండ్రుల వద్దకి వెళ్లిపో. అలాచేసి నన్ను సంతోష పెట్టు" అని నలుడు దమయంతి నెంతగానో బ్రతిమాలాడు. కాని ఆమెవినలేదు. "మీరెక్కడుంటే అక్కడే నాకు సుఖం. మిమ్మల్ని విడిచి వుంటే స్వర్గంకూడ నాకు నరకతుల్యమే. అదికాక మీ ధర్మ పత్నినయిన నేను మీతోబాటు కష్టసుఖాలు పంచుకొని అను భవిస్తాను కాని ఒంటరిగా అనుభవించగలనా? మరి ఆ మాటలాడవద్దని ప్రార్థిస్తున్నాను, మిమ్మల్ని విడిచి ఒక్క క్షణమైనా నేనుండలేను" అని ఆమె కంటతడి పెట్టుకొని చెప్పింది.

పగలు రెండు ఝాముల వేళ అయింది. నలునికీ దమయంతికీకూడ ఆకలి ఎక్కువగా అవుతూంది. ఏదైనా వేటాడి తెద్దామని బయల్దేరాడు నలుడు. ఇతనికోసమే వచ్చాయా అన్నట్లు సమీపంలోనే వచ్చి వ్రాలాయి కొన్ని పావురా పిట్టలు. నలునిచేతిలో ఏముంది? వలలేదు. కర్రలేదు కత్తిలేదు ఏమీలేదు. పైమీదనున్న అంగవస్త్రాన్ని వాటి మీద విసిరాడు. పక్షులు దొరకలేదు. సరికదా, అవి ఆ వస్త్రాన్ని లంకించుకొని ఆకాశానికి ఎగిరిపోయాయి.

విన్నావా చెల్లీ, పైమీద బట్ట పక్షులు ఎత్తుకుపోయే కష్టప్ర రోజులనే సామెత ఎరుగవూ? అది యీనలమహారాజు కథతోటే పుట్టింది.

నలుడు ఏకవస్త్రుడై, పక్షులమీద, బట్టమీద ఆశవిడచి నీరైనా దొరుకుతుందేమోనని నాల్గు ప్రక్కలాచూచాడు. అడవిలో నీరెక్కడ! నిప్పెక్కడ! అదికూడ దొరకలేదు. మొగం తేలవేసి దమయంతి దగ్గరకు వచ్చాడు. ఇద్దరూ ఒకరి అవస్థచూచి మరొకరు విచారపడ్డారు. దేవతలకికూడ వారి దీనస్థితి చూచి జాలికలిగింది. అమృతభరితమైన ఒక ఫలాన్ని వారిముందు పడవేసారు. అకస్మాత్తుగా ఆకసంనుండి పడిన పండుచూచి నలుడు బ్రహ్మానంద భరితుడయ్యాడు. దమయంతికిచ్చి తినమన్నాడు. ఆమె దీనిని మీరే తినండని తియ్యారించింది. ఒకరి నొకరు బతిమాలుకోసాగారు. ఇంతలో ఒక వృద్ధ బ్రాహ్మణుడు హఠాత్తుగా అక్కడికి వచ్చాడు. "అయ్యో, ఆకలి, దాహం, ఎవరక్కడ? నాకింత ఆహారం పెట్టకపోతే బ్రహ్మహత్య వారి మెడకు చుట్టుకొంటుంది". అని అరుస్తూ ఆ దంపతుల ముందు మూర్ఛపడ్డాడు. సహజంగా ఉదారులు, దానశీలురు, పరమ దుఃఖదుఃఖితులు అయిన ఆ రాజదంపతులు తమకని దేవతలు పంపిన ఆ అమృత ఫలాన్ని చావగూర్చున్న బ్రాహ్మణుని కిచ్చి 'అతిథి దేవోభవ' అనుకున్నారు. ఆ పండుతిని, త్రేన్చి బొజ్జనిమురుకుంటూ తనత్రోవను పోయాడా బ్రాహ్మడు. ఆ బ్రాహ్మణు డెవరో తెలుసునా? కలి. వారినోటిదగ్గరకి

వచ్చిన ఫలాన్నికూడ మాయచేసి తన్నుకుపోయాడు. అంటేద అంటకుండా ముట్టేది ముట్టకుండాచేసి ముప్పు తిప్పలాపెట్ట డమే కలిగారి విలాసం.

పాపం, ఆకలితో అలసి, సొలసి దమయంతి నిద్ర పోయింది. అలా కటిక నేలమీద పడుకొని నిద్రిస్తున్న మహా రాణిని చూచి నలుని మనస్సు మరీ వికలమయింది. "ఈ నిద్రిస్తూన్న సమయంలో ఇక్కడ యీమెనువిడచి నేనెక్కడ కైనాపోతే బాగుండదూ? నేను కానరాకపోతే యీమె బుద్ధి మళ్లించుకొని పుట్టింటికిపోయి సుఖపడుతుందికదా!" అనుకున్నాడు నలుడు. కాని ఎలా వెళ్ళడం. కాళ్లురాలేదు. చాలసేపు తటపటాయించాడు. 'తనకోసం బెంగపెట్టుకొని చచ్చిపోతుందేమో' అని భయపడ్డాడు. 'ఆమెను కాపాడ వలసిందని దేవతలందరినీ ప్రార్థించాడు. ఆమె కట్టుకున్న చీరలో ఒక ముక్క చింపి తన కంగవస్త్రంగా పుచ్చు కొన్నాడు. గుండె రాయిచేసుకొని, గుడ్లనీరు నింపుకొని, కనిపిస్తూన్నంత వరకు వెనక్కి మళ్ళిచూస్తూ, వెళ్ళినవాడు రెండు మూడుసార్లు తిరిగివచ్చి, చూచి చివరికి తెగించి ఆమె నా అడవిలో వదిలి నలుడెక్కడికో పోదామని బయ ల్దేరి వెళ్లిపోయాడు.

కొంతదూరం పోయేసరికి అతని కా అడవిలో కార్చిచ్చు మధ్య చిక్కుకొని 'పాహిపాహి'అని అరుస్తూన్న పాము ఒకటి కనిపించింది. పరోపకార పరాయణుడు, ఆర్త త్రాణ బిరుదాంకితుడు అయిన నలుడు తటాలున ఆ పామును

చిచ్చులోనుంచి వెలికి తీసేడు. బయటపడడమే తడవుగా ఆ పాము నలుని బొటనవేలిమీద గట్టిగాకాటువేసింది. నలుడీ కృతఘ్నతకి నిర్ఘాంతపోయాడు. "మహారాజా, నన్ను నిందించకు. నేను నిన్ను కరవాలనే కరిచాను. నా పేరు కర్కోటకుడు. ఈ నాకాటువల్ల నీరూపు మారిపోతుంది. ఈ కష్టకాలంలో మారురూపంతో నువ్వు ఎక్కడైనా ఉండి కాలం గడపవచ్చు. తిరిగి మంచిరోజు వచ్చాక, నన్ను తలచుకొంటే నీ పూర్వ రూపం నీకు వస్తుంది. లోగడ నీపైమీద బట్టను పక్షులు ఎత్తుకుపోయాయి కదూ. అదికూడ నీకు తిరిగి లభిస్తుంది. నువ్వు తిన్నగా అయోధ్యకి పో. అక్కడ ఋతుపర్ణుడనే రాజు పరమ ధార్మికుడు రాజ్యంచేస్తున్నాడు. నీ కతనివద్ద ఆశ్రయం దొరుకుతుంది. నీకు శుభమౌతుంది. మరి శెలవు" అని చెప్పి ఆ పాము మాయమయింది. నలుడు నల్లగా మాడిపోయి, పొట్టిగా మరుగుజ్జుగా మారిపోయాడు.

కర్కోటకుడు చెప్పినమాటప్రకారం నలుడు ఋతుపర్ణుని వద్దకి చేరుకొన్నాడు. తనపేరు బాహుకుడని చెప్పుకున్నాడు. వంట చెయ్యడంలో నేర్పరినని విన్నవించుకొన్నాడు, అవసరమైతే రథసారథ్యం కూడ చేయకలనని చెప్పాడు. రాజుకి ఇతని మాటలు నచ్చాయి. వెంటనే తమదివాణంలో వంటవానిగా బాహుకుని నియమించాడు. 'బ్రతికి ఉంటే బలుసుఆకు' అనే సామెతగా నలుడక్కడ అజ్ఞాతంగా కాలం గడపసాగేడు.

అక్కడ దమయంతి నిద్రనుండి మేల్కొని, నలుడు కానరాకపోయేసరికి గాభరాపడింది. అటూ ఇటూచూచి వెదికి వేసారింది. దిగులుపడి పదేపదే పిలిచింది. కన్నీరు మున్నీరుగా కార్చి వలవల విలపించింది. తన్నుతానెరుగని దుఃఖావస్థలోపడి మూర్ఛిల్లింది.

మూర్ఛలో మునిగితేలినంతలోగా ఆ మహాపతివ్రతకి మరికొన్ని పాట్లు వచ్చాయి. ఒక కొండచిలువ ఆమెనుపట్టి మింగబోయింది. అప్పుడే మూర్ఛనుండి తెప్పిరిల్లిన దమయంతి పామునుచూచి భయపడి ఆర్తనాదం చేసింది. దైవికంగా ఒక బోయవాడా త్రోవనుపోతూ దమయంతి విలాపాన్ని విని, తటాలునవచ్చి, కొండచిలువను చంపి, ఆమెను రక్షించాడు. అయితేనేమి, వాడు ఆ పాముకంటె ఎక్కువ దుర్మార్గుడు. దమయంతి రూపలావణ్యాలుచూచి వాడామెను మోహించాడు. తన్ను పెళ్లాడవలసిందని ఆమెను బలవంతపెట్టసాగాడు. దమయంతి వానికెన్నో బుద్ధులు చెప్పింది. ఎంతగానో బోధించింది. ఎంతైనా దీనంగా విలపించి ప్రార్థించింది. వాడు వినలేదు. దమయంతి కోపగించుకుంది. ఆమె మహాపతివ్రత ఆమె గుడ్లెర్రచేసేసరికి వాటినుండి అగ్నిజ్వాలలు బయలువెడలేయి. బోయవాడా అగ్నిలోబడి నిలువునా బూడిదయ్యాడు.

ఈ విపత్తు గడచిన పిదప దమయంతి, నలుని వెదకుతూ, గోలు గోలున ఏడుస్తూ ఆ అడవియంతా తిరిగింది. సింహాలు, పులులుకూడ వచ్చి ఆమె దీనావస్థనుచూచి జాలి

పడి నిల్చిపోయేవి. మదించిన ఏనుగుల గుంపు . ఆమె కెదు రుగావచ్చి ప్రక్కనుకు తప్పుకొని వెళ్లిపోయింది. ఇదంతా చూచి దమయంతి 'భగవంతుడు నేనిలా సుఃఖిస్తూ బ్రతకా లనే కోరుతున్నాడు కాబోలు' అనుకొంది.

అడవి దాటినపిదప దమయంతికి కొందరు బిడారు వర్త కులు కనిపించారు. వారిసహాయంతో ఆమె చేదినగరం చేరు కుంది. ఆ నగరానికి రాజు సుబాహుడు. అతని భార్య దమ యంతికి సాక్షాత్తు పినతల్లి. అయితేమి, మాసిన తలా, చిరి గిన చీరతో ఉన్న దమయంతిని ఎవరు పోల్చుకోగలరు? అదృష్ట వశాత్తు రాణిగారి దృష్టి వీధిలోపోతున్న దమ యంతిపై బడింది. ఆమె దాసీలను పంపి దమయంతిని తన అంతఃపురానికి పిలిపించింది.

రూపురేఖా విశేషాలవల్ల దమయంతి ఉత్తమ కులీను రాలనీ, కాలవైపరీత్యంచేత ఏదో కష్టంలోఉండి ఉదాశీనంగా ఉన్నాదనీ, దమయంతిని చూడగానే రాణి గుర్తించింది. 'అమ్మా, నీవెవరు? ఏదో కష్టంలో, మసిలోఉన్న మాణిక్యం వలె కనిపిస్తున్నావు. నిన్నుచూస్తే నాకు పుత్రవాత్సల్యం కలుగుతూంది. తప్పులేకపోతే నీసంగతి చెప్పు. నాకు వీలయిన నీకు సహాయంచేస్తాను. లేదంటే మాయింట్లో మా అమ్మాయి సునందతోపాటు సుఖంగా ఉండు' అని రాణి అతి ఆప్యాయంగా ఆదరించిపలికింది. దమయంతి కొన్నాళ్ళక్కడ ఉండటానికి అంగీకరించింది. కాని తానెవరో మాత్రం చెప్పలేదు. చెప్తే నలునిగూర్చికూడ చెప్పవలసివస్తుంది.

అరణ్యంలో అమాయికురాలిని నొక్కర్తెను విడిచివెళ్లాడనే నేరానికి నలుణ్ణి అందరూ నిందిస్తారు. తనభర్తను వేరొకరు నిందిస్తూంటే వినడం ఆ పతివ్రతకు కిట్టదు. అందువల్ల, అప్పటి కనుకూలంగా ఏదో చెప్పి, అజ్ఞాతంగా అక్కడ కొన్నాళ్లు కాలం గడపటానికి నిశ్చయించింది.

నలుడు రాజ్యభ్రష్టుడై దమయంతితో కలిసి ఎటో పోయాడని తెలిసిన దగ్గరనుండి భీమసేనుడు వారిద్దరినీ వెదకి రావలసినదని చారులను నాల్గుప్రక్కలా పంపి ప్రయత్నిస్తున్నాడు ఆ చారులలో సుదేవుడనే ఒక ప్రాజ్ఞుడైన బ్రాహ్మడున్నాడు. అతడు చేది నగరంలో దమయంతినిచూచి, ఆనవాలు పట్టి, సుబాహుని కామె పరిచయం చెప్పి, అతని అనుమతిమీద సగౌరవంగా దమయంతిని విదర్భనగరానికి పంపే ఏర్పాట్లు చేయించాడు.

దమయంతి పుట్టింటికి చేరుకొంది. తన పిల్లలిద్దరినీ చేరతీసి కౌగలించుకొంది. తల్లిదండ్రుల చాటున ఉన్నా, భర్త పరారీ అయిఉన్నాడనే దుఃఖంచేత దినదినమూ కృశించిపోతూ, ఎడబాటు సహిస్తూ, నలుని రాక కెదురు చూస్తూ ఎలాగో కాలం గడపసాగింది. నలునిజాడలు వెదకడానికి నలుప్రక్కలా దక్షులైనవారిని పంపుతూ, అతణ్ణిపోల్చుకొనేందుకు అనువైన గుర్తులెన్నో వారికి చెప్పిపంపింది.

అదృష్టవశాత్తూ, దమయంతిని పోల్చి తెచ్చిన సుదేవుడే, అయోధ్యలో బాహుకుణ్ణి చూసేడు. దమయంతి చెప్పిన లక్షణాలు, బాహుకుని మాటలు, నడవడి, వగైరా

లన్నీ చక్కగా చూచి, అన్వయించి అనుమానించాడు. అన్నీ సరిగా ఉన్నా రూపులో నలునికీ, బాహుకునికీ స్వర్గ మర్త్యాలకున్నంత ఏడముంది. అందుచేత అతడు నేరుగావచ్చి దమయంతి కీసంగతి విన్నవించాడు. దమయంతికూడ అను మానించింది. కారణాంతరాలచేత రూపు మారిపోయి ఉం టుందని నిశ్చయించింది. ఏదో ఉపాయంచేత అతణ్ణి విదర్భ నగరానికి రప్పించాలని ఆలోచించింది. తిరిగి ఆ సుదేవుని చేతనే దమయంతీ ద్వితీయ స్వయంవరానికి తాము దయ చేయ వలసినదని ఋతుపర్ణునికి ఆహ్వానం పంపే ఏర్పాటు చేసింది. స్వయంవరం రెండురోజుల వ్యవధిలో జరుగుతుందని చెప్పమంది. అంతతొందరలో రావాలంటే నలుడుతప్ప మరెవ్వరూ సారథ్యంచేసి ఋతుపర్ణునికి సహాయపడలేరని ఆమె ఎరుగును. ఎంతమారినా మానవంతుడైన నలుడు, దమయంతీ ద్వితీయ స్వయంవరమనే మాటవింటే, బయట పడి తీరతాడనే నమ్మకం కూడ ఆమెకుంది. అందుకని పన్నాగం పన్నింది.

స్వయంవరవార్త వినగానే ఋతుపర్ణుడు ప్రయాణసన్నద్ధు డయ్యాడు. కాని వ్యవధిలేదే. ఏమి చేయవలెనో పాలుపోక దిగులుగా కూర్చొన్నాడు. బాహుకుడు కూడ ఈ వార్త విన్నాడు. అతనికి వంటిమీాద తేళ్లూ, జెర్రులూ ప్రాకినట్లని పించింది. ఎలాగైనా స్వయంవర సమయానికి తానుగూడ విదర్భనగరం పోవాలని నిశ్చయించాడు. అందుకని రాజు గారికి తాను సారథిగా ఉండి, ఈ అల్పవ్యవధిలో అతనిని

అయోధ్యనుండి విదర్భకు చేరుస్తానని ఒప్పుకున్నాడు. ఋతు పర్ణుడు పరమానందభరితుడై బయల్దేరాడు.

నలుడు అశ్వహృదయమనే విద్య ఎరుగును. అంచు వలన అతని సారథ్యంలో గుర్రాలు గాలికంటె వడిగా పరు గెత్తి పోవసాగేయి. ఋతుపర్ణుని అంగవస్త్రం గాలికెగిరి పోయి క్రిందపడింది. దానిని తిరిగి తెచ్చుకోవాలని అతడు రథమాపమన్నాడు. కాని బాహుకుడు 'మహారాజా రథం నాలుగుమైళ్లు ముందుకువచ్చింది. దిగివెళ్తారా?' అన్నాడు. ఋతుపర్ణుడు మహాశ్చర్యపోయి, తానెరిగిన అక్షహృదయ మనే విద్య బాహుకుని కిచ్చి, అతనివద్ద తాను అశ్వహృద యం నేర్చుకొన్నాడు. అనుకొన్న సమయానికి ఒకపూట ముందుగానే ఋతుపర్ణుని రథం విదర్భ చేరుకుంది. బాహు కుడు వంటశాలకి వెళ్లాడు. ఋతుపర్ణుడు తనకని సగౌరవంగా అమర్చిన విడిదిలో బసచేసాడు. కాని స్వయంవరానికి మరే రాజకుమారులు రాకపోవడంచూచి. మొదట ఆశ్చర్య పడ్డాడు. తనొక్కడే వచ్చినందుకు ఆమీద లోలోపల సిగ్గుపడ్డాడు.

దమయంతి బాహుకుని పరీక్షించడానికని తన చెలికత్తె భారతిని నియోగించింది. ఆమె వెంట తనబిడ్డ లిద్దరినీ పంపింది. నలుడా పిల్లలనుచూచి కంటతడి పెట్టుకొన్నాడు. ఎత్తుకొని ముద్దాడేడు. తనపిల్లలలాగే ఉన్నారనీ, అందుకని అంతగా అభిమానం కలిగిందని చెప్పి చూపరుల ఆశ్చ ర్యాన్ని, అనుమానాన్ని తగ్గించజూచాడు. "రేపు దమ

యంతినిచూసి నా భార్యలాగే ఉంది అంటావేమో'' అంది భారతి. "అలా ఎందుకంటాను? కాని భారతీ, దమయంతి వంటి పతివ్రత తిరిగి పెళ్లాడడాని కెలా ఒప్పుకొన్నాదో నాకు తెలియకుండా ఉంది. నలమహారాజు, కాలవైపరీత్యంవల్ల ఎక్కడ ఏ రూపులో ఉన్నాడో తెలియదు. కాని అట్టివాని భార్య, ఆపదసమయంలో ఆయనను విడిచి మరొకరిని వరించ బూనడమే ఆశ్చర్యకరమైన విషయం''అన్నాడు బాహుకుడు. "అడవిలో అతిదారుణంగా వదిలేసిపోయిన నలుడు మంచి వాడా? అతని ఐపు తెలియకపోగా యిప్పుడు మళ్లా పెళ్లాడ తానంటే దమయంతి చెడ్డదా? ఎక్కడసీతులివి, బాహుకా'' అని ఉటంకించింది భారతి. "కాదు భారతీ, ఆమెపడే కష్టాలు చూడలేక, అలా వదిలిపెట్టిన పిదపనైనా ఆమె తన పుట్టింటికి చేరి సుఖపడుతుందనే సహృదయంతోనే నలుడలా విడిచి వెళ్లిపోయుంటాడని నా నమ్మకం. ఇంతకీ భర్త ఉండగా తిరిగి పెళ్లాడ దలచినమీా దమయంతి భర్తమీాద నిందారోపణ చెయ్యాదా? పోనీ, నాకెందుకులే. ఏదో వంటలవాడిని. లోక విడ్డూరమైన విషయంకదా అని యింతవరకు ఏమోఅన్నాను. క్షమించు'' అని నలుడు వంటయింట్లోకి వెళ్లిపోయాడు. అతడక్కడ కళ్లు తుడుచుకుంటూండడం భారతి గమనించింది. అతడు వండిన వంటకా లడిగిపుచ్చుకొని వెళ్లింది. అన్ని సంగతులు విని, నలపాకాన్ని రుచిచూచి, దమయంతి బాహుకుడే నలుడని నిశ్చయించింద.

తల్లి దండ్రుల వద్ద అనుమతి గ్రహించి దమయంతి వంటశాలలో ఉన్న బాహుకుని వద్దకు వెళ్ళింది. తన అపరాధం మన్నించమని అతని కాళ్ళమీద పడింది. అతన్ని రప్పించడానికే తాను ఊహ పన్నినానని చెప్పి, తద్వారా అతనికి కష్టం కలిగించినందుకు క్షమాపణ వేడుకుంది.

నలుడు కర్కోటకుని స్మరించాడు. వెంటనే అతని అంగవస్త్రం అతని భుజంపై వచ్చి పడింది. మరుగుజ్జు రూపు మాయమయి, దివ్యసుందరమైన అతని పూర్వపు రూపు తయనకు వచ్చింది. దమయంతిని లాలించి, ఆదరించి, పిల్ల లిద్దరినీ ఎత్తుకొని, అత్తమామలవద్ద కేగి, వారికి నమస్క రించాడు నలుడు. బాహుకుడే నలుడని వినగానే ఋతుపర్ణుడు ఎక్కడలేని ఆనందాన్ని పొందాడు. ఆ దంపతు లిద్దరినీ ఆశీర్వదించి, వారివలన కృతజ్ఞతలు, మన్ననలు పొంది, అతడా మరునాడు తన నగరానికి పయనమయ్యాడు.

కొన్నాళ్లు అత్తమామలవద్ద ఉండి, నలుడు తిరిగి నిషధపురానికి వెళ్లాడు. నలుడు వచ్చాడని తెలియగానే పుష్కరుడు భయపడ్డాడు. తిరిగి జూదమాడి నలుడు తాను ముందు ఓడిపోయిన రాజ్యమంతా మళ్లా గెల్చుకున్నాడు. పుష్కరుని క్షమించి విడిచిపెట్టాడు. భార్యా పిల్లలను విదర్భ నుండి తెప్పించుకొని సుఖంగా నలుడు చిరకాలం రాజ్యం చేశాడు. అతని రాజ్యంలో మరెన్నడూ కలిబాధలు లేవు.

చెల్లీ, యీ కథ వింటే కలిబాధ లుండవు. నల దమయంతులనీ, నాగరాజైన కర్కోటకుణ్ణీ, రాజర్షి అయిన ఋతుపర్ణుణ్ణీ తలచుకొంటే సమస్తమైన కలి కల్మషాలు అంతరించి పోతాయి. సకల సంపదలూ కలుగుతాయి. ఇది జ్ఞాపకముంచుకొని రోజూ స్మరిస్తావు కదూ! శుభం.

# నాగానందం

చెల్లీ, దేవతలు అమృతం తాగేరు కదా, మరి వాళ్ళకి ఆకలి దప్పికలు లేవుకదూ? అని అడిగావు. నిజమే, వాళ్ళకి ఆకలి వెయ్యదు. దాహంకూడ లేదు. అయితేనేమి, వాళ్ళకీ మనలాగే సుఖం, దుఃఖం బెంగా బెదురూ, ప్రేమ వివాహం, ఈర్ష్యాఅసూయా, స్నేహం, విరోధం వగైరాలన్నీ ఉంటాయి. వాళ్ళలోకూడ మనలో వలెనే ఎన్నో కులాలు, తెగలు ఉన్నాయి. వాళ్ళలో వాళ్లు దెబ్బలాడుకుంటూ ఉంటారు కూడాను, చూడు. ఇప్పుడో చక్రని కథ చెప్తాను విను. ఇది విద్యాధరులనే దేవతలకి రాజైన జీమూతవాహనుని కథ. అతడెంతో మంచివాడు. పరోపకారి. స్వార్థత్యాగి. అతనివలన నాగకులమంతా బ్రతికి బాగుపడింది. ఈ కథ అంటే నాగులకెంతో ఆనందం.

జీమూతవాహనుడు విద్యాధరులకి రాజైన జీమూతకేతువు కొడుకు. సర్వవిధాలా తగినవాడు కదా అని తండ్రి జీమూతవాహనుణ్ణి రాజుగాచేసి తాను తపస్సుకి పోదామనుకొన్నాడు. కాని జీమూతవాహనుడు రాజ్యం చేయటానికి ఇష్టపడలేదు. అడవిలో తల్లి దండ్రుల సేవచేస్తూ తపస్సు చేసుకోవటమే సుఖమైన జీవితమని అతడు తలంచేడు. అందుకని ఎవరెన్ని విధాల చెప్పినా వినకుండా అతడు తన

రాజ్యాన్ని మంత్రుల కప్పగించి, తల్లిదండ్రులతో కలిసి తపస్సుకి బయలుదేరాడు. జీమూతవాహనునికి ఆత్రేయుడనే బాల్య స్నేహితుడొకడున్నాడు. అతడుకూడా వారితోపాటు అరణ్యంలో ఉండడానికే నిశ్చయించాడు. వీరంతా మలయ పర్వత ప్రాంతంలో ఎక్కడైనా ఆశ్రమం కట్టుకొని తపస్సు చేసుకొందామని అనుకొని అక్కడికి బయల్దేరి వెళ్లారు.

తండ్రిగారి అనుమతి పొంది, ఆశ్రమం కట్టుకోడానికి అనువైన స్థలం వెదకడానికని జీమూతవాహనుడు, ఆత్రేయునితో కలసి బయల్దేరాడు అది మలయ పర్వతం. పర్వతం నిండా మంచి గంధపు చెట్లే, ఎక్కడ చూచినా చెట్లు, లతలు ఒకటికొకటి పెనవేసుకొని పెరిగిఉన్నాయి. రకరకాల మొక్కలు, రంగు రంగుల పువ్వులు, పలువిధాల పక్షులు, గుంపులు గుంపులుగా ఉన్న లేళ్లు, అన్యోన్యంగా పెరిగే ఏనుగులు, ఇంకా ఎన్నో జంతువులు ఆ అడవిలో ఎక్కడ చూచినా తారస పడతాయి. అక్కడక్కడ ఎవరో మునీశ్వరులు కట్టుకొన్న తపోవనాలు, ఆశ్రమాలుకూడ ఎదురౌతాయి. ఆయా చోట్ల మంచినీటి కోనేర్లు, సలసల ప్రవహించే సెలయేళ్ళు, వేడి వేడి నీటిబుగ్గలు కూడ కనిపిస్తాయి. ఇవన్నీ చూస్తూ, తమకి తగిన తావు వెతుకుతూ, జీమూతవాహనుడూ, ఆత్రేయుడూ కలిసి వెళ్లి వెళ్లి, ఒక ప్రాచీన దేవాలయ సమీపానికి చేరుకొన్నారు. ఈ అడవిలో యీ దేవాలయ మెలావచ్చింది.? దీనిని ఎవరు కట్టించారో? ఇంతకీ ఇది ఏ దేవునిది? అని వారిలో వారు ఏవేవో పిచ్చి

ప్రశ్నలు వేసుకొంటూన్నంతలో, ఆ దేవాలయంలోనుంచి అతి మధురమైన వీణాగానం వారికి వినిపించింది. వారిచెవుల కెంతో ఆనందమైంది. కాని ఆశ్చర్యం మరింత హెచ్చ యింది. అదేదో దగ్గరగాపోయి చూడాలనే కుతూహలం వారిని మరింత త్వరపెట్టింది. ఇద్దరూ గబ గబా దేవాలయ ప్రాంగణంలోకి త్రోవదీసారు. ముఖమంటపం దాటారు. ముందుకు పోయి తొంగిచూసేరు. వాళ్ళకి తెలియకుండానే వాళ్ళక్కడ ఆగిపోయి కన్ను రెప్పవెయ్యకుండా అలా చూస్తూ నిల్చిపోయారు.

అక్కడ ఒక దివ్యసుందర విగ్రహమైన విద్యాధర సుందరి వీణవాయించి దేవిని ప్రార్థిస్తూ పాడుతూంది. ఆమె ప్రక్కనే ఆమె చెలికత్తె పూజాద్రవ్యాలు గల పళ్ళెం, పన్నీరు బుడ్డీ, గంధపు గిన్నె, పూల దండలు వగైరాలు పట్టుకొని కూర్చొంది. ఎదుట జగన్మాత పార్వతి విగ్రహం అభయముద్ర పట్టి, చిరునవ్వుతో, షోడశ కళాపరిపూర్ణంగా విరాజిల్లుతూంది.

"ఈ కన్య ఎవరు? ఈఅడవిలో యీ మందిరమెందు కుంది? ఈమె ఏ కోరికతో యీ దేవినిలా ఆరాధిస్తూంది? ఇంతకీ యీమెతో మాట్లాడి పరిచయంచేసుకొనే అవకాశం మనకెలా కలుగుతుంది?" అని జీమూతవాహనుడు తన మనస్సులో ఎన్నో గుత్తులు గుత్తులుగా ప్రశ్నలు వేసుకొం టున్నాడు. ఆత్రేయుడు కూడా అదే విధంగా ఆలోచిస్తు

న్నాడు. కాని జీమూతవాహనుని అంతరంగంలో ఏముందో కూడ అతడు గ్రహించేడు. "మిత్రమా, చూడు, మనమీ చేరువలోనే ఈ మంటపం వెనుక నిలబడి వీరి ప్రసంగం విందాం. అలాగైతే వీరి ఆచూకీ, ఆనవాళ్ళు అన్నీ అర్థమౌతాయి" అని చెప్పి ఆత్రేయుడు జీమూతవాహనుణ్ణి రెక్క పట్టుకొని మంటపం వెనుకకు తీసుకొని పోయాడు. కాళ్ళురాక, కళ్ళామె కప్పగించి, శరీరం ఆత్రేయుడి వశం చేసి ఎల్లాగో జీమూతవాహనుడు మంటపం వెనుకకు నడిచేడు. అక్కడ ఓ చోట దాగొని వారిద్దరూ వీరి మాటలు విందామని చెవులప్పగించి కూర్చొన్నారు.

పాడుతూన్న పాట ముగించి విద్యాధర కన్యక దేవి నారాధించింది. అత్యధికమైన భక్తిశ్రద్ధలతో పూజచేసింది. అపరిమితమైన విశ్వాసంతో ప్రార్థించి తీర్థ ప్రసాదాలు స్వీకరించింది. తిరిగి వీణమీటుతూ ప్రార్థనగీతాలు పాడడానికి ఉపక్రమించింది. ఆ సమయంలో ఆమె చెలికత్తె ఇలా అన్నది. "రాజకుమారీ, నీవింతగా ప్రార్థించినా ఆ దేవి హృదయం కరిగినట్లులేదు. ఇది దేవికాదు నిజంగా రాతి బొమ్మసుమా."

"ఛీ, తప్పు" అని ముక్కుమీద వేలువేసుకొన్నది రాజకుమార్తె. "చతురికా, నీ మాటలు దేవికి కోపం తెప్పించేవిగా ఉన్నాయి. నిజానికి దేవి నన్ను కరుణించింది. నిన్న రాత్రి నాకు కలలో కనిపించి యీ రోజున నాకు కాబోయే వరుడు కనిపిస్తాడని ఆనతి ఇచ్చింది" అని రాజ

కుమార్తె చెప్పేసరికి చతురికకు ఎక్కడలేని భక్తి శ్రద్ధలు ఉదయించేయి. దేవికి సాష్టాంగపడి, తన అపచారం క్షమించమని ప్రార్థించింది. తిరిగిలేచినవ్వుతూ "సరేకాని, మలయవతీ, ఆ మహాపురుషుడో, మన్మథుడో నురియింకా నీ కంట పడలేదేమి?" అని వికటంగా ప్రశ్నించింది రాజకుమారిని.

ఇదే తగిన సమయమని ఎంచి జీమూతవాహనుడు చాటునుండి బయటకువచ్చి, ఆత్రేయునితో కలిసి మంటపంలోకి నడిచాడు. వీరినిచూచి ఆ కన్యకలు, వారినిచూచి వీరు తెల్లబోయినట్లుగా నిల్చున్నారు. ఎవరికేమి చెయ్యవలెనో, ఎవరు ముందుగా మాట్లాడవలెనో ఎవరికీ పాలుపోలేదు. మలయవతి సౌందర్యానికి ముగ్ధుడై, మోహనిద్ర మునిగి మూర్ఛిల్లినట్టి అవస్థలో ఉన్నాడు జీమూతవాహనుడు. ఈ జగన్మోహనాకారుడే తనకు దేవిప్రసాదించిన వరుడని నిశ్చయించి పట్టరాని ఆశ్చర్యానందాలతో తన్నుతానే మరిచిపోయింది మలయవతి.

"అమ్మా, మిమ్మల్ని కౌశికులవారు రమ్మని కోరుతున్నారు" అని పిలుస్తూ వచ్చిన ఓ బ్రహ్మచారి మాటలు వీరందరినీ మోహనిద్రలోనుంచి మేల్కొల్పాయి. కులపతి ఆజ్ఞ జవదాటరానిదిగదా! వెంటనే మలయవతీ చతురికలు ఆ బ్రహ్మచారివెంట కౌశికుని ఆశ్రమానికి వెళ్ళిపోయారు.

నిరాశపడి, నిట్టూరుస్తూ జీమూతవాహనుడు ఆలయప్రాంగణం దాటి, దగ్గరసాఉన్న ఒక లతామంటపంలో

కూర్చొబడి పోయారు. అక్కడ ఓ పెద్ద రాతిబండ ఉంది. దానిని చూడగానే అతనికో చక్కని ఊహ స్ఫురించింది. "ఆత్రేయా, జేగురురాయి దొరికితే చూసి తెచ్చిపెడతావా? ఆ సుందరి విగ్రహాన్ని యీ బండమీద చిత్రిస్తే బాగుండదూ?" అన్నాడు. ఆత్రేయుడు సరేనని వెళ్ళి అక్కడా ఇక్కడా వెదికి ఓ జేగురురాయి తెచ్చియిచ్చేడు. జీమూతవాహనుడు అపరిమితమైన ఆనందోత్సాహాలతో ఆ రాతిమీద మలయవతి చిత్రాన్ని గీయడానికి పూనుకొన్నాడు.

కౌశికులవారి దర్శనంచేసి యింటికివెళ్ళిన మలయవతికి మనస్సు మనస్సులో లేదు. జీమూతవాహనుడిమూర్తి ఆమె కళ్ళకి కట్టినట్టుంది. ఆమె మనోభిప్రాయాన్ని గమనించి చతురిక ఆమెను తిరిగి ఆలయప్రాంతానికి తీసుకువచ్చింది. దూరంనుండి వారు జీమూతవాహనుణ్ణి చూసేరు. వెనుకగా వచ్చి వేరొక పొదరింటిలో నిల్చి అతడేమి చేస్తున్నాడో గమనించారు. కాని పొరపాటున అతడు చిత్రిస్తూన్న విగ్రహం వేరొక సుందరిదని అనుకొన్నారు. మరేముంది? మలయవతికి పట్టరాని దుఃఖం వచ్చింది. ఆమెను ఓదార్చి ధైర్యం చెప్పేసరికి చతురికకు తలప్రాణం తోకకు వచ్చినంతయింది.

అంతలో మలయవతి అన్న మిత్రావసువు జీమూతవాహనుని వెదకుతూ అక్కడికి వచ్చాడు. "మహారాజకుమారా, నిన్ను తోడ్కొని రమ్మని మా తండ్రిగారు

నన్ను ఆజ్ఞాపించి పంపేను. మా చెల్లెలు మలయవతిని నీవు పరిగ్రహించవలసినదని ముందుగా నేను ప్రార్థిస్తున్నాను. మా తండ్రిగారి ప్రార్థన మీ తండ్రిగారి సమ్మతి తరువాత విందువుగాని'' అని అతడు జీమూతవాహనునితో చెప్పిన మాటలు వినగానే మలయవతికి ఎంతగానో ఆశ్చర్యం, ఆశ, ఆనందంకూడ కలిగాయి. చతురిక "భేష్, ఇదంతా దేవి కృప'' అన్నది.

"ఆర్యా, మీ ఆదరానికి ధన్యవాదాలు, కాని నా మనస్సు అప్పుడే వేరొక సుందరిపై లగ్నమయింది. ఇప్పుడు మరొక ప్రక్కకు దానిని మరలించడం, ధర్మమా? అధర్మమా? అనే ప్రశ్న అటుంచి, అసలు నా వశంలో లేని విషయము కాబట్టి మీరు నన్ను క్షమిస్తూ, యీ మాటలు మీ తండ్రిగారితో చెప్పవలసినదని మిమ్మల్ని ప్రార్థిస్తు న్నాను'' అనిచెప్పి జీమూతవాహనుడు యింటికి పోవడానికి కూడ నిరాకరించాడు.

మిత్రావసువు ఆత్రేయునితో సలహాచేసి జీమూత కేతువుతో చెప్పి వ్యవహారం సానుకూలం చేసుకొందామని బయల్దేరాడు. అదేదో చూచిరావలసినదని చతురికను అతని వెనుకనే పంపించింది మలయవతి. కాని ఆమెకు నమ్మకం లేదు. తన బ్రతుకుమీద తనకే అసహ్యం వేసింది. చతురిక వెళ్ళిన పిదప ఒంటరిగా ఉన్నప్పుడు ఆమె దుఃఖము మరింత ఎక్కువైంది. తుదకు పైటచెంగుతో మెడకు ఉరిపోసుకొని ఆత్మహత్య చేసుకొందామని నిశ్చయించింది. "దేవీ, ఈ

జన్మలో కాకపోతేమానె, మరొక జన్మలోనైనా నన్ను జీమూతవాహనుని భార్యగా పుట్టించు'' అని దేవిని ఆఖరిసారి ప్రార్థించి, మెడలో ఉరిపోసుకొంది. పైటచెరగు చాలలేదు. దగ్గరసాఉన్న తీగలు మెడకు చుట్టుకొని చెట్టుకి వేలాడింది.

చతురిక మొదటినుంచీ అనుమానిస్తూంది. ఒక్కర్తైనా వదలివెళ్తే యీ రాజకుమార్తె ఏ ఘాతుకమో చేసిపోతుందేమోనని, కొంతదూరం మిత్రావసుని వెంటవెళ్ళినట్లే వెళ్ళి తిరిగివచ్చి రాజకుమార్తెనొకసారి చూచిపోబోయింది. ఇకనేముంది. ఆమె భయపడి నల్లేలయింది. గుండె జల్లుమంది. లబో లబోమని గోలపెట్టి దగ్గరసా పరుగెత్తుకెళ్ళింది. "అయ్యయ్యో, మా రాజకుమారి, మలయవతి ఉరిలోపడి కొట్టుకుంటూంది. రక్షించండి రక్షించండి'' అని బొబ్బలుపెట్టి ఏడ్వసాగింది.

చతురిక బొబ్బలు వినగానే జీమూతవాహనుడు తాను వ్రాస్తూన్న చిత్రాన్ని విడిచి, మలయవతిని రక్షించడానికి పరుగెత్తాడు. మొలనున్న కత్తితో తీగలుకోసి మలయవతిని ఉరిలోనుండి తప్పించాడు. "ఎవరిది?'' అని ముఖంచూచి, తాను వలచిన విద్యాధరియే యీ మలయవతి అని గ్రహించి, అపరిమితంగా ఆనందించాడు. ఆత్మహత్యా ప్రయత్నానికి హేతువు తెలిసికొని, ఆమె రెక్కపట్టుకొని తాను వ్రాస్తూన్న చిత్రంవద్దకు తీసుకొనిపోయి, 'ఇదిగో, ఈమె నా హృదయేశ్వరి' అని చెప్పి నవ్వించాడు.

ఇంతలో జీమూతవాహనుని రమ్మని పిలువడానికి ఆత్రేయుడు వచ్చాడు. "మీ తండ్రిగారు మలయవతిని కోడలుగా గ్రహించడాని కంగీకరించాడు. పెళ్లికొడుకు వయ్యావు పద" మన్నాడు. అందరూ నవ్వుతూ, సరసాలు, పరిహాసాలు పలుకుతూ ఇంటికి మరలేరు.

ఒక చక్కని శుభముహూర్తంలో మలయవతీ జీమూతవాహనుల వివాహం మహావైభవంగా జరిగింది. వివాహమైన తర్వాత కొన్నాళ్లు అత్తవారింట్లోనే ఉండి జీమూతవాహనుడు సకల సౌఖ్యాలు అనుభవిస్తూ, ఆత్రేయ మిత్రావసువులతో కలిసి అక్కడా ఇక్కడా విలాసంగా విహరిస్తూ కాలం గడుపుతూ వచ్చాడు. తనరాజ్యంమీదికి శత్రువులు దండెత్తి వచ్చారని విని కూడా ఆతడు రాజ్యలోభంతో యుద్ధానికి బయల్దేరలేదు. పదిమందిని చంపి తెచ్చిన రక్తపుకూడుకంటె, పండుటాకులో, పండుకాయలో తిని బ్రతకటం ఉత్తమోత్తమమైన పద్ధతి అని నిర్ణయించుకొని, అదే నీతిని ఆచరణకి తెచ్చుకొన్నాడు.

ఒకనాడు జీమూతవాహనుడు మిత్రావసువుతో కలిసి సముద్రతీరంలో విహరిస్తున్నాడు. తత్సమీపంలో ఉన్న పర్వతాల పంక్తినిచూచి మెచ్చుకొంటూ నడుస్తూఉంటే మిత్రావసువు జీమూతవాహనునితో ఇట్లాచెప్పాడు. "బావా ఇవి మలయపర్వతపు శిఖరాలు కావుసుమా. చచ్చిపోయిన పాముల ఎముకల గుట్టలు."

జీమూతవాహనుడీ మాటవిని ఆశ్చర్యం విషాదం కూడా పొందాడు. "ఇన్ని పాములు ఇక్కడకువచ్చి ఎందుకు, ఎలా చచ్చిపోయేయో కదా!" అన్నాడు. అదివిని మిత్రావసువు అతనికా రహస్యం వివరించాడు.

"నాగులంటే గరుత్మంతునికి పగ. ఎందరినో నాగులను గరుడుడిక్కడ సంహరించి భక్షించాడు. ఎదిరించి గరుడునితో పోరాడలేక పాపం, పాములన్నీ అతనితో ఒక సమయము చేసుకొన్నాయి. రోజుకొక్కటి వంతున అతని ఆహారం నిమిత్తం అవి యిక్కడకు వచ్చి గరుడుని చేతిలో చావడాని కనుమతించాయి. గరుడుడీ సమయాని కంగీకరించాడు. నాటినుండి నేటిదాకా అతడు రోజుకో పామును చంపి భక్షిస్తున్నాడు. అలా చచ్చిన పాముల ఎముకలే ఇక్కడ కొండ గుట్టలవలె పడిఉన్నాయి". అని చెప్పిన మిత్రావసుని మాటలువిని జీమూతవాహనుని దయార్ద్ర హృదయం కరిగి కన్నీళ్లై ప్రవహించింది. ఏ ఉపాయంచేత నైనా నాగజాతిని రక్షించాలనే సంకల్పం కలిగింది. అందు కని ఆత్మబలిదానమైనా చేయడానికి వెనుకతీయనని అతడు నిశ్చయించుకొన్నాడు. వ్యర్థమైన యీ శరీరం పరోపకారం కోసం ఖర్చుపడితే నాజన్మ సార్థకమే అవుతుంది అని లోలోపల సంతోషించాడు.

ఇంతలో ఒక రాజభటుడు వచ్చి మిత్రావసువును "మీ తండ్రిగారి శెలవౌతున్నాదని" చెప్పి తీసుకొని

పోయాడు. జీమూతవాహనుడు ఒంటరిగా ఆ పాముల ఎము కలు గుట్టలుచూచి విచారిస్తూ అక్కడా ఇక్కడా నిల్చి నిట్టూరుస్తూ ఆ ప్రాంతంలో తిరుగుతున్నాడు. ఇంటికి పోడా నికి అతనికి మనస్కరించలేదు. అదేసమయంలో ఆతని చెవికి ఒక ఆర్తనాదం వినిపించింది. అతని ధ్యానం ఆ ప్రక్కకి ఆకర్షించబడింది. అదెవరో ఒక వృద్ధురాలి దీనా లాపమని కొంతసేపు విన్నపిదప బోధపడింది. సహాయపడ దామనే ఉద్దేశంతో అతడా ఏడుపువినవస్తూన్న దిక్కుకి నడిచేడు.

పాపం! ఆ ముసలియామె తన కొడుకుని కౌగలించు కొని గోలు గోలున ఏడుస్తూంది. ప్రక్కనే ఒకరాజభటుడు నిలుచున్నాడు. జీమూతవాహనుడికి మొదట ఇదేమో బోధ పడలేదు. రాజభటునివలన అన్ని విషయాలు అడిగి తెలుసు కొన్నాడు. వారు నాగులు. ఆ యువకుడు శంఖచూడుడు. అతడా ముసలియామెకు ఏకైక సంతానము. ఈ రోజు గరు డుని కాహారంగా పోయి చావవలసేవంతు అతనికి వచ్చింది. అదే రాజాజ్ఞ తెచ్చి నిలుచున్నాడా రాజభటుడు. కొడు కుని వదలలేక ఏడుస్తూంది తల్లి. మళ్లా మళ్లా కొడుకుని కౌగ లించుకొంటూంది. గుండెబాదుకొని ఏడుస్తూంది. తన బ్రతుకు నిందించుకొంటూంది. దైవాన్ని దూరుతూంది. ఏడ్చి ఏడ్చి మూర్ఛపోయి, తిరిగి తెప్పరిల్లి తారస్థాయిలో రోదిస్తూంది. డుకా మెనోదారుస్తున్నాడు. జీమూతవాహనుడి హృదయ

విదారకమైన దృశ్యం చూడలేక పోయాడు. వారి పోదారుస్తూ అతడిలా అన్నాడు.

"అమ్మా, నీవెందుకిలా విచారిస్తావు. నీకుమారుని రక్షించే ప్రయత్నం నేను చేస్తాను. నీకుమారునికి బదులుగా నేనీరోజున గరుడుని భోజనమవుతాను". అనిచెప్పి ఆహారంగా వెళ్ళవలసేవారు ధరించే ఎర్రవస్తులు తనకిమ్మని ప్రార్థించేడు. శంఖచూడుడు విస్మితుడయ్యాడు. వృద్ధ తెల్లబోయింది. రాజభటుడు తన్నుతాను నమ్మలేకపోయాడు. క్షణంలో కథ అడ్డం తిరిగినట్లయింది. తమకోసం మరొక వ్యక్తి బలి అవుతాడంటే ఆ తల్లి కొడుకులిద్దరికీ నచ్చలేదు. వారందు కంగీకరించలేదు. అతడు కోరిన ఎర్రవస్తులు అతనికివ్వలేదు. పరోపకారం కోసం ప్రాణత్యాగం చేయటంలో తప్పులేదంటాడు జీమూతవాహనుడు. స్వార్థంకోసం ఇంకొకరి ప్రాణాలు బలిఇవ్వడం మహాపాపమంటారు శంఖచూడుడు, అతని తల్లిని. ఎంతచెప్పినావినక శంఖచూడుడు, తానే గరుడుని కాహారంగా పోవడానికి నిశ్చయించి, చని పోయేముందు దైవ ప్రార్థన చేసుకొంటానని తల్లితోకలిసి సమీపంలో ఉన్న శివాలయానికి వెళ్ళాడు.

ఆరోజు దీపావళి. సర్వులకు ఆనందదాయకమైన పర్వం. పండుగకదా అని జీమూతవాహనుడికి అత్తవారు క్రొత్త బట్టలు కట్ట బంపేరు. కట్టుమందుకొందామనే ఆశతో నౌకరు ఆ బట్టలు పట్టుకొని జీమూతవాహనుని వెతుక్కుంటూ వచ్చేడు. అవి ఎర్రటి పట్టుబట్టలు. ఆబట్టలు

చూసి జీమూతవాహనుడు బ్రహ్మానందభరితు డయ్యాడు. తనకార్యం సానుకూలమైనట్లు భావించాడు. నౌకరుని సం తోషపెట్టి పంపాడు. తానాదుస్తులు ధరించి గరుడుని కాహా రంగా పోవడానికి నిశ్చయించి, తొందరగా నాగుల ఎముకుల పట్టలున్న చోటికి నడిచేడు. అక్కడ అందరూ చనిపోయే బండమీద గరుడుని రాక కెదురుచూస్తూ, ఆపాద శిరఃపర్యం తము ఎర్రగుడ్డ కప్పుకొని, వెల్లకిలా పడుకొన్నాడు.

ఇంతలో పెద్ద తుపానుగాలి లేచింది. హోరుమని చప్పుడు వినిపించింది. భూమ్యాకాశాలు కంపించినట్లయింది. కళ్లు మిరిమిట్లు గొలిపే సువర్ణకాంతులు మెరిసేయి. గరుత్మం తుడు రివ్వునవచ్చి జీమూతవాహనుడున్న బండమీద వాలాడు. తోడనే ముక్కుతో జీమూతవాహనుడి వక్షః స్థలంమీద ఒక్కపోటు పొడిచేడు. ఈ ఆత్మబలిదానం, ఈ స్వార్థత్యాగం, ఈ పరోపకార పారీణతచూచి దేవతలు జయజయధ్వానాలుచేసి పువ్వులవాన కురిపించారు. గరుత్మం తుడి కది ఆశ్చర్యహేతువైంది. తాను రుచిచూచిన రక్తం కూడ నాగరక్తంవలె లేదు. దీని అంతు తాపిగా తెలిసు కొందామనే తలంపుతో అతడు జీమూతవాహనుణ్ణి ముక్కుతో కరచి పట్టుకొని మలయపర్వత శిఖరంమీదికి ఎగిరి వెళ్లాడు. వెళ్తూన్నప్పుడు. జీమూతవాహనుడి శరీరం లోనుండి రక్తపు చుక్కలు నేలరాలసాగేయి. అతని ఆభర ణాలు వదులై దిగజారి క్రిందపడసాగేయి.

ఈ లోగా జీమూతవాహనుడి కోసం అత్తమామలు, బావమరుదులు, భార్య, తల్లిదండ్రులు అందరూ వెదుకుతూం టున్నారు. అతడింకా ఇంటికి రాలేదేమని వారంతా ఆందో ళన పడుతున్నారు. ఆ సమయంలో ఆకాశంమీదనుంచీ ఎగురుతూన్న గరుడుని నోటిలో ఎరగాఉన్న జీమూతవాహ నుడి చూడామణి జారి క్రిందపడింది. అది అతని తల్లికే దొరికింది. మరేముంది? చూడగానే ఆమె దానిని పోల్చిపట్టి తన కొడుకు కేదో విపత్తు వచ్చినదని భావించి గోలపెట్టి ఏడ్వసాగింది. అంతాకలిసి జీమూతవాహనుడు విడిసిన సముద్రతీరానికి నడిచేరు.

అంతలో అక్కడికి శంఖచూడుడు వచ్చాడు. అతడు కూడ విలపిస్తున్నాడు. "ఈరోజున నాకు బదులుగా ఎవరో పుణ్యాత్ముడు తన ప్రాణాలు బలియిచ్చాడు. నా మెడకి అకారణంగా పాపం చుట్టుకుంది" అని ఏడుస్తూ అతడు తన కథ అంతా ఈ రాజపరివారానికి విన్నవించాడు. వారివలన ఆ పరోపకారపారాయణుడు జీమూతవాహనుడనిన్నీ వీరంతా అతని ఆత్మీయులని తెలుసుకొన్నాడు. గరుడుని కెరయైజీమూత వాహనుడు హతుడయ్యాడని భావించి, అతని తల్లిదండ్రులు శోకావేశంతో మూర్ఛాగ్రస్తులయ్యారు. మలయవతి భర్త గారి చూడామణి అందిపుచ్చుకొని చితిపేర్చుకొని చనిపోవ డానికి ఉద్యుక్తురాలయింది. శంఖచూడుడి కిదంతాచూచి కడుపు తరుగుకొనిపోయినంత దుఃఖమయింది. అయినా

త్రాను మనస్ఫూర్తిగా, గుండెబరువుతీరా ఏడవడానికి బదులు వారి నోదార్చవలసేపని అతని తలపై బడింది.

"అమ్మా. మీరు కొంత ఓపిక పట్టండి. జీమూత వాహనుడు విద్యాధరుడు. గరుడుడు నాగులనే కాని అన్యు లను చంపడు. కాబట్టి నిజం తెలిసి అతనిని వదలివేయ వచ్చును. లేదా మనమేపోయి ప్రార్థిస్తే మంచిది. ఆ కని పిస్తూన్న శిఖరం మీాదికి పదండి. అక్కడ మనకి గరుడుడు, జీమూతవాహనుడు కూడ దొరకవచ్చు" అని శంఖచూడుడు వారందరికీ బోధించి, నచ్చజెప్పి, ఒప్పించి, తనతోపాటు వారందరినీ మలయపర్వత శిఖరానికి నడిపించేడు.

అక్కడ పర్వత శిఖరం మీాద వ్రాలి గరుడుడు శాం తంగా జీమూతవాహనుణ్ణితినబోయాడు. మొదట ముక్కుతో పొడిచి రక్తం పీల్చాడు. పిదప కొంచెం మాంసం పీకి తిన్నాడు. కాని జీమూతవాహనుడు చలించలేదు. అందరి నాగులవలె గోలపెట్టి ఏడ్వలేదు. ఇది గరుడుని కాశ్చర్యం కలిగించింది. ఇతడెవరా అనే సంశయం కలిగింది. ఈ ఆలో చనలతో అతడు కొంతసేపు నిశ్చేష్టుడై నిలబడ్డాడు.

అదిచూచి జీమూతవాహనుడు ఇలా అన్నాడు, "మహాత్మా, ఏమిటాలోచిస్తున్నారు. నా దేహంలో ఇంకా రక్తమాంసాలున్నాయి. సంపూర్తిగా, సంతృప్తిగా తిని నన్ను ధన్యుని చేయవలసిందని ప్రార్థిస్తున్నాను" అన్నాడు. ఈ మాటలువినగానే గరుడునికి తన తప్పేదో బోధపడింది. ఇతడు నాగకులీనుడు కాడని స్పష్టపడింది. "నేను నీప్రాణాలు

తీయబోయాను, కాని నీ ధైర్యసాహసాలతో నీవు నా హృదయాన్నే తీసివేసేవు. నీవెవరు?'' అని గరుడుడు జీమూత వాహనుణ్ణి అడిగేడు.

“నేనెవరైతేనేమి! కొంచెపటి తమరు తమఆకలి తగ్గించుకొండి. తర్వాత అన్నీ తెలుస్తాయి'' అన్నాడు జీమూత వాహనుడు. ఇంతలో వెనుకనుంచి శంఖచూడుని కేక వినపడింది. “పక్షిరాజా, అన్యాయంగా మీరు విద్యాధరుణ్ణి చంపి తింటున్నారు. అతనిని వదలండి. ఇదుగో నేను వస్తున్నాను. ఈ రోజునమీకాహారంగా రావలసిన వాడిని నేను. నాకు బదులు యీ దయామయుడు తన ప్రాణాన్ని మీకు బలియిచ్చేడు. అతని తల్లిదండ్రులు; అత్తమామలు, భార్య, బంధువులు అంతా వెనుకనుండి వస్తున్నారు. అతనిని విడిచి పెట్టి పుణ్యం కట్టుకొండి'' అని అరుస్తూ గాభరాగాపరుగెత్తి వచ్చాడు శంఖచూడుడు.

గరుడుడు తటాలున జీమూతవాహనుణ్ణివిడిచి ప్రక్కకు తప్పుకొన్నాడు. తానుచేసిన పనికి పశ్చాత్తాపపడుతూ శంఖ చూడుని వలన జరిగిన కథంతా సాంతంగా విన్నాడు. కాని ఏమి లాభం? జీమూతవాహనుడి శరీరంలో సగం అప్పుడే అతని కడుపులో జీర్ణించుకుపోయింది.

రక్తసిక్తమైన శరీరంతో చావసిద్ధమై కొనఊపిరితో ఉన్న జీమూతవాహనుణ్ణి చూచి తల్లి దండ్రులు, అత్త మామలు, భార్య అందరూ గోలుగోలున ఏడ్చి, మొత్తుకొని, మూర్ఛిల్లేరు. “ఏ దేవతలకైనా దయరాదా! నా కొడు

పక్షికి బలియై చావవలసినదేనా! ఇప్పుడే అమృతవర్షమో కురియకూడదా! తల్లీ, జగన్మాతా! అంబికా, నాకుమారుని కాపాడవా!'' అని పరిపరివిధాల ఏడుస్తూన్న జీమూతవాహనుని తల్లినిచూచి గరుడుడెంతో సిగ్గుపడ్డాడు "అమ్మా, ఊరకే విలపించకండి. ఈరోజునుండి నేను నాగులను తినని శపథం చేస్తాను. జరిగినదానికి విచారించి ప్రయోజనం లేదు. అయినా ఒక్క క్షణం మీరు ఓపికపడితే నేనువెళ్లి అమృతం తెచ్చి జీమూతవాహనుణ్ణి బ్రతికిస్తాను'' అని చెప్పాడు గరుడుడు. చెప్పినంతపనీ చేయగల సమర్థుడు గనుక అతడు వెంటనే స్వర్గలోకానికి ఎగిరివెళ్ళాడు అమృతం తేవడానికి.

మలయవతికి వీరిమాటలేవీ వినిపించలేదు. ఆమె దుఃఖావేశంలో తన్నుతానే మరిచిపోయింది. చితిపేర్పించుకొని అగ్నిలోదుముకడానికి త్వరపడుతూంది. "అయ్యో, గౌరీమాతా, నీమాటలు కూడా పొల్లయ్యాయికదూ! నీ మొగుడు విద్యాధర చక్రవర్తి అవుతాడు. నీవు చిరకాలం అతనితో కలిసి సుఖిస్తావు, అని పల్కిన పల్కులు శుద్ధ అబద్ధంగా మారిపోయాయి కదా, తల్లీ, ఇక దేనికి నా జన్మ! ఎందుకీ భగవద్భక్తి? దేనిమీద ఆశ? ఏది ఆధారం! ఎవరాలంబన? అగ్నిముఖంగా నా ప్రాణంకూడ తీసివేసి సుఖించు'' అని క్రోధశోకావేశాలతో పల్కుతూ ఆమె చితికి ప్రదక్షిణం చేయసాగింది. ఆమెనుచూసి. ఆమె తెగింపు గ్రహించి, చేసేదిలేక విరక్తిపడి, ఆమె తల్లిదండ్రులుకూడ అగ్గిలో గెంతడానికి ఉద్యుక్తులయ్యారు.

ఇంతలో ఓ ప్రక్కనుంచి అమృత కలశంతో వచ్చాడు గరుత్మంతుడు. మరో ప్రక్క ప్రత్యక్షమైంది పార్వతి. అమృతం పోసి జీమూతవాహనుణ్ణి బ్రతికించాడు గరుడుడు. కమండలోదకం జల్లి చిగిర్చింది పార్వతి.

లేచి వచ్చిన కొడుకుని కౌగలించుకొని, జీమూతవాహనుని తల్లిదండ్రులు పార్వతికి సాష్టాంగపడ్డారు. మలయవతి భర్తతో కలిసి గౌరికి మ్రొక్కింది. గరుడుడు శంఖచూడుని విడిచిపెట్టి, అతనిద్వారా సమస్త నాగకులానికీ అభయమిచ్చి పంపాడు. పార్వతి ఆశీస్సులతో జీమూతవాహనుడికి విద్యాధర రాజ్యం లభించింది.

చెల్లీ, చూసేవా, జీమూతవాహనుడి త్యాగంవల్ల నాగకులమంతా నిర్భయంగా బ్రదుకగలిగింది. అందుకే యీ కథ అంటే నాగుల కిష్టం. ఇది వింటే పాములవల్ల భయముండదు. చావుఅంటే అందరికీ భయమే. బ్రతుకుమీద ఆశ అందరికీ ఒక్కలాటిదే. అందుచేత ఎంత దుష్టజంతువ్రనైనా సరే చంపకూడదు. ఒకరికి అపకారంచేసినకంటె పరోపకారం కోసం ప్రాణాలు విడిచినా మంచిదే.

సర్వేజనా స్సుఖినోభవంతు.

